రామానుజరావు, సోమరాజు

విషవాహిని

నిడదవోలు, 1916

Record no. 200

Rāmānujarāvu, Sōmarāju

Viṣavāhini

Niḍadavōlu, 1916

Record no. 200

## Bibliographic Record Target

రామానుజరావు, సోమరాజు.

విషవాహిని / ఇది సోమరాజు రామానుజరావుచే రచియింపఁబడినది.- 1. కూర్పు.- నిడదవోలు : ఆంధ్రప్రచారిణీముద్రాక్షరశాల , 1916.

(1), 47, (1) p. ;18 cm.

Record no. 200

Rāmānujarāvu, Sōmarāju.

Viṣavāhini / idi Sōmarāju Rāmānujarāvucē raciyimpam̐baḍinadi.- 1. kūrpu.- Niḍadavōlu : Āṃdhrapracāriṇīmudrākṣaraśāla, 1916.

(1), 47, (1) p. ;18 cm.

Record no. 200

35 mm microfilm

Image placement: IA IIA IB IIB     Date filming began:

ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయము.
అనుబంధగ్రంథమాల. 28.




# విషవాహిని.

ఇది

సోమరాజు రామానుజరావుగారిచే
రచియింపఁబడినది.



[illegible]య్యగారి నారాయణమూర్తి బి. యే. బి. యల్. గారిచే
సంపాదింపఁబడినది.

మొదటికూర్పు.

నిడదవోలు
ఆంధ్రప్రచారిణీముద్రాక్షరశాలలో
ముద్రింపఁబడినది.

1916

వెల రు 0—3—0.

# పీఠిక.

---

ఇది స్వకపోలకల్పితమగు చిన్నినవల. ఈగ్రంథము నురచించిన సోమరాజు రామానుజరావుగారు భాషాసేవ చేయుచున్న మాయాంధ్రప్రచారిణీ గ్రంథనిలయమునకు సర్వస్వాతంత్ర్యములతో దీని నొసంగినందులకు వారికి మేమెంతయుఁ గృతజ్ఞతాపూర్వక వందనము లర్పించుచున్నారము.

సంపాదకుఁడు.

---

శ్రీరామచంద్ర.

# విషవాహిని.

## మొదటి ప్రకరణము.

సెలవులిచ్చి నేఁటికేడుదినములైనను, చక్రపాణి రాజమహేంద్రవరము నుండి కదలలేదు. ఎండకాలపు సెలవులిచ్చిన వెంటనే కళాశాల కట్టుటయే తడవుగ విద్యార్థులందఱును తమతమయిండ్లకేగుచుండిరి. చక్రపాణి కూడ నిదివఱలో నిట్లాలసించియుండలేదు. సెలవు లీక రెండుదినములుండఁగనే పడవకొఱకు గోదావరిచుట్టును తిరుగుచుండువాఁడు. ఈసారి యాతని పుస్తకములు, బట్టలు మొదలగునవన్నియు నింకేను నెక్కడివక్కడనె పడియుండెను. ఇదియంతయుఁజూచిన నీసారి యాతఁ డింటికిఁ బోఁదలఁపనట్లు కాన్పించుచున్నది. స్నేహితుల వెంటఁగూడ నాతఁడు కొన్నినాళ్లనుండియు నంత విరివిగఁ దిరుగుచుండుటలేదు. చక్రపాణిబస యిన్నీసుపేటలోని యొకమిద్దెటిల్లు.

చక్రపాణి మేడమీఁద నేదియో చింతించుచు నటునిటు తిరుగుచుండెను. కొంతసేపటి కాతఁడు తలయెత్తిచూ

చెను. ఎదుటనున్న మేడమీఁదనున్నసుందరవిగ్రహ మాతనికన్నులంబడియెను. చక్రపాణి వికసితవదనుఁడయ్యెను. మేడమీఁదనున్నసుందరి కొనకువచ్చి చక్రపాణితో సంభాషించెను.

" పాణీ! నీవీమాఁటేమి యింకనునిద్రపోవుచున్నావు? పడవదొరకలేదా? మీయూరినుండి చుక్కదుర్గయ్యపడవవచ్చినది. పోవేమి ? "

చక్రపాణి కొంతతడవవనతవదనుఁడై యుండెను. ఆతనికి సరియగుప్రత్యుత్తర మేమియుఁ దోఁచినదికాదు.

"నుండుట నీకంతకష్టమా రోహిణీ!" అనెను.

"అదియెంతమాట! క్రిందటిదీపావళిపండుగకు మీ నాయన యీయూరికివచ్చియున్నప్పుడు వైశాఖమాసమున నీకు వివాహమని చెప్పియుండెనుగాదా! శుభకార్యమునకు వెళ్లిపోయితివిగావని యడిగితిని."

చక్రపాణి ముగ్ధుఁడై కొంతతడవు తలవంచుకొనియెను, ఆతఁడేమియు ననలేదు. కొంతతడవచ్చటనిలిచి తుదకేమియుఁ బ్రత్యుత్తరమీయకుండఁగనే యచ్చటినుండి లోనికేగెను. పోవునప్పుడు చక్రపాణి యొక్కమారయిన రోహిణివంకఁజూడలేదు.

రోహిణి యతృప్తహృదయయై యింటిలోనికేగెను.



అట్లుపోయి "అన్నా! అన్నా!" యని రోహిణి కేకవేసెను. రోహిణియన్నయగు సుందరుఁడు గదిలోఁగూర్చుండి మెల్లగ నేమియో వ్రాసికొనుచుండెను. అదివిని యాతఁడు "ఏమి? రోహిణీ!" యని పలికెను. రోహిణి సుందరుని సమీపమునకువచ్చి యచ్చటియాసనముపైఁ గూర్చుండెను.

"ఏమిరోహిణీ! పిలిచితివి?"

"అన్నా! అదేమి? చక్రపాణి భద్రాచలము పోలేదేమి?"

"ఏమో తెలియదు—"

"చక్రపాణి వెనుకటివలె లేఁడు. కారణమేమో!"

సుందరునిదృష్టి తాను వ్రాయుదానిమీఁదనున్నది. ఆతఁడీమాటల నంతగా వినిపించుకొనలేదు. రోహిణి యస్థిమితహృదయముతో నచ్చటినుండి తనగదిలోనికేగెను. ఆమె దిండుమీఁదఁ దలఁజేర్చికొనియుండెను. కన్నులవెంట రోహిణి కేకారణముననో నీరు గారుచుండెను. ఆమె రహస్యముగ నేడ్చుచుఁ గన్నులుతుడుచుకొనియెను. రోహిణి యిట్లూహించెను.

"చక్రపాణి తిన్నగలేఁడు!, సెలవులలో నిదివరకెన్నఁడు నింటికేగకుండనుండలేదు. ఇప్పుడంతవిచారమేమి వచ్చినది చెప్పుమా! నాయన్నకయిన విచారము గల్గినప్పుడు

నాహృదయము పరితపింపదు. కాని, చక్రపాణిహృదయమ్మున విచారముగలిగెనేని నేను దానిని భరింపఁజాలను. భగవంతుఁడా! చక్రపాణిని సంతోషస్వాంతునిగఁ జేయుము. నన్నేమిచేసినను సరియే. చక్రపాణిని సంతోషచిత్తునిగఁ జేయుమని ప్రార్థించుచున్నాను.”

## రెండవప్రకరణము.

---

సెలవులలోఁ జక్రపాణి తనస్వగ్రామమగు భద్రాచలమున కేగియుండలేదు. తండ్రి నాలుగైదుదినములు లా రాకకు నిరీక్షించెను. కాని, చక్రపాణి రాలేదు. భద్రాచలమునందలికొందఱుపాధ్యాయులు సెలవులీయఁగనే రాజమహేంద్రవరమునుండి భద్రాచలమువచ్చిరి. తండ్రియగు మధుసూదనుఁడు కుమారునివృత్తాంతమేమనియడిగెను. కాని, వారేమిచెప్పఁగలరు? “ఇంకను ప్రయాణసన్నాహము చేయుటలేదు. ఈమారు రానట్లుతోఁచుచున్నది.” అని చెప్పిరి. మధుసూదనునకుఁ గోపమువచ్చెను. అతఁడు కుమారునకావైశాఖమాసముననే వివాహము చేయవలయునని తలపెట్టియుండెను. కాని, యాతఁడు రాలేదు. “తక్షణము బయలుదేఱి రావలసినది?” అని మధుసూదనుఁడు చక్రపాణికి తంతివార్త నంపెను. చక్రపాణి దానినొకమూలఁ బాఱవైచి గదిలోఁ బరుండి తలుపులుబిగించుకొని యేమో యోచించుచుండెను. తంతివార్తకును ప్రత్యుత్తరమువచ్చినదికాదు; కుమారుఁడుగూడ రాలేదు. మధుసూదనుఁడు తానేబయలుదేరెను. నాలుగుదినములకు పడవమీఁద రాజమహేంద్రవరముచేరెను.



మధుసూదనునకుఁ బుత్రుఁడనినఁ బ్రేమయే! చక్రపాణికిఁ దండ్రియెడఁ బ్రేమయున్నది. కాని, యెంతప్రేమయో అంతవెఱపుకూడఁగలదు. తండ్రివచ్చినవార్త చక్రపాణి కానందమునుకలుగనిచ్చినదికాదు. అతఁడు వినయముతోఁ దండ్రికడఁ గూర్చుండెను.

మధు—అబ్బాయీ! మనము రేపే భద్రాచలము పోవలయును.

చక్రి—అంతతొందరయేమి? ఈసెలవులకువచ్చి నేమిచేయుదును?

మధు—నీవీమారు తప్పక యింటికిరావలయును.

చక్రపాణి యిఁకఁ దండ్రికెదురాడలేదు. తనలో—“దైవమా! ఈప్రయాణమునకైన నాటంకముఁ గలుగఁ జేయుము—” అనితలఁచి రెండుచేతుల శిరస్సునానుకొని యొకయుష్ణశ్వాసమునువదలెను. మధుసూదనుఁ డచ్చటినుం

డి వెడలిపోయి గోదావరియొద్ద పడవలకొఱకై వెదకెను. సరిగా నామరుసటిదినమే యొకపడవ కదలుటకు సిద్ధముగ నుండెను. దానిని మాటాడుకొని యింటికివచ్చి యావార్త కుమారునితోఁ జెప్పి యొచ్చటికో పోయెను. అతఁడేమియు ననలేదు. "ఈ ప్రయాణము నాముప్పునకే వచ్చినది—" అని తలంచుచుండెను. క్రిందటిదినమునుండియు రోహిణిమనస్సూరకుండలేదు. ఆ బాలిక పాపమాందోళపడుచుండెను.

రాజమహేంద్రవరమున రోహిణికూడఁ దనయన్నయగుసుందరునితోను, చక్రపాణితోను, సువర్ణుఁడు మొదలగువారితోను గళాశాలలోఁ జదువుకొనుచున్నది. సువర్ణుఁడను బాలుఁడు రోహిణికత్తకొడుకు; రోహిణిని సువర్ణునకిచ్చుట కందఱునుతలంచియుండిరి. రోహిణియెడసువర్ణునకుఁగూడ వాత్సల్యముగలదు.

రోహిణి సాయంకాలమాఱుగంటలవేళఁ జక్రపాణి యేకాంతముగనొక్కచోఁ గూర్చుండియుండఁగ నచ్చటికి వచ్చెను.

రోహి—ఏమిపాణీ! మీనాయన వచ్చెనఁట! నీపెండ్లివార్త మాతోఁ జెప్పకయేపోయితివి.

చక్రపాణి మాటాడలేదు. "నీకోరికలివియా? పాడుకోరికలు!" అని తలంచుచుండెను.



రోహి—నీపెండ్లియెప్పుడుపాణీ?

చక్రి—నాకిప్పుడేమి పెండ్లి రోహిణీ?

రోహి—అదేమిపాణి? నీకన్నచిన్నవారికిఁ బెండ్లియగుచున్నది.

చక్రి—ఆమాట మానివేయుము. నేను పెండ్లిచేసికొనవలెననుకొనుటలేదు.

తరువాతఁ జాలసేపు వారామాటయు నీమాటయు మాటాడుకొనిరి. రోహిణి చక్రపాణిని బలవంతముగ సుందరునియొద్దకు లాగుకొనిపోయెను. అచ్చటనే సుదర్శనుఁడుండెను. వారందఱికిఁ జక్రపాణిప్రయాణము తెలిసినది.

మఱునాఁ డెట్లయిన ప్రయాణమునిలిచిపోవునని చక్రపాణి తలంచెను. కాని, [illegible] సరియగువేళకే మధుసూదనుని చక్రపాణినెక్కించుకొని పడవ భద్రాచలమునకు బయలుదేరినది. చక్రపాణి [illegible]తాత్ముఁడై యాపడవలోఁ గూర్చుండెను.

---

## మూఁడవ ప్రకరణము.

---

చక్రపాణి వచ్చెననువార్త భద్రాచలమునందలి యాతనిప్రియనెచ్చెలులకందఱకును దెలిసి వచ్చిరి. కొందఱాతనిని వెనుకటివలె గోదావరీతీరమునకు వాహ్యాళికి రమ్మ

నియు—కొందఱు శుక్రవారమంటపము పైఁడాబామీఁదఁ గూర్చుందమనియు, నింకఁగొందఱు గోరీలమిట్ట కావలనున్న చిన్నవనమున విహరించుటకరమ్మనియు, నింకొకకొంద "ఱీ దినము శుక్రవారము వెంకటరమణయ్యగారి సత్రమునకుర మ్మ. అచ్చట దేవీపూజజరుగును." అనియు నిట్లు నలువురు నాలుగువంకలకు లాగుచుండిరి. చక్రపాణి యేదిక్కునకును బోవలేదు. ఎవ్వరిమాటను వినక యచ్చటనే కూర్చుండియుం డెను. ఒకస్నేహితుఁడు "పెండ్లికుమారునివలె నింటఁ గూర్చుందువేమిపాణీ!" అనియెను. ఇంకొకఁడు—"పెండ్లికుమారుఁడుకావుననే యిట్లుకూర్చుండెను." అనియెను. కాని, యామాట లాతని కిష్టముగ నుండలేదు. చక్రపాణి యింకొకమాటఁదెచ్చిపెట్టి యాసంభాషణమును మఱపించెను. చక్రపాణి యెచ్చటికిఁ గదలకుండుటచే నందఱు నచ్చటనే కూర్చుండియుండి కొంతసేపు పూర్వవృత్తాంతములఁగూర్చి మాటాడుకొనిరి. తరువాత దుర్గాప్రసాదు చేసినప్రశస్తములగు పకోడీలతో కొంతసేపు కాలముపుచ్చి యెవరియిండ్లకువారేగిరి. కాని, యచ్చట చిన్ననాఁటినుండియుఁ జక్రపాణి కాంతరంగికమిత్రుఁడగు రంగారావుమాత్ర మొక్కఁడే కూర్చుండియుండెను. రంగారావును చక్రపాణివదలలేదు. అందఱును వెడలిపోయినతరువాతఁ జక్రపాణియు,రంగారావును గలిసి శుక్రవారపుమంటపమునకేగిరి. వారొక్కమారుమాత్రము భగవంతునిదర్శించివచ్చి యాడాబాపైఁ గూర్చుండిరి.



చక్ర—రంగారావూ! మాయింటివంకకు నీవిన్నినాళ్లనుండియు నెన్నఁడయిన వచ్చియుంటివా?

రంగా—నాకేమిపని? నీక్షేమమునుగనుఁగొనుటకు మాత్రమే యిటుదేవాలయమునకువచ్చునప్పుడు మీయింటిదనుక వెళ్లి వచ్చువాఁడను.

చక్ర—మాయింటిలోఁ బెండ్లిప్రయత్నములు జరుగుచున్నవి. నీవు నన్నుఁ దిట్టకున్న నీకొకమాటఁ జెప్పెదను. నాకు వివాహమాడవలయునని లేదు.

రంగా—ఏమి? పెండ్లికుమార్తె కురూపిణి

చక్ర—పెండ్లికుమార్తె! ఆమెయెవ్వరో, టనున్నదో, చూచినవారెవరు? నాతో నేమాటయుఁ జెప్పకుండ నాయనగారు రాజమహేంద్రవరమునుండి లాగికొ వచ్చిరి. ఇంటికి రాఁగనే నన్నందఱును పెండ్లికొడుకు పెండ్లికొడుకని పిలువఁజొచ్చిరి. నాకేమియుఁ దెలియదు.

రంగా—అయినఁగానిమ్ము—నీవేల పెండ్లియాడవు? పెండ్లిసంతోషకరమైనదే కాదా!

చక్ర—రంగారావూ! నన్నిఁక నేమియుఁ బ్రశ్నిం

ఘకుము. ఇంక నింటికిం బోవుదము రమ్ము, ఏది యెట్లున్న నీ వివాహ మేమో నాకిష్టముగ లేదు.

ఇది జరిగిన కొన్ని నాళ్లకు ముహూర్తము సమీపించెను. దినములు గడచిన కొలంది మధుసూదనుని యింట వివాహకార్యములు తీవ్రముగ జరుగుచుండెను. చక్రపాణి హృదయ మీసమయమున నెట్లు కల్లోలమగుచుండెనో యెవరెఱుంగుదురు? ముహూర్త మింక మూఁడు దినములున్నది. అందఱును పెండ్లికి తరలిపోవుటకు సిద్ధమయిరి. అప్పుడయినఁ దండ్రితో నీవివాహము వలదని చెప్పవలయునని చక్రపాణి తలంచెను. కాని, తండ్రి యెదుటికేగినతోడనే తాను దేనిని చెప్పవలయునని యచ్చటికేగెనో, దానిం జెప్పఁజాలకపోయెను. పెండ్లికి తరలిపోయిరి. ఆయూరు నైజాము రాజ్యములోని శ్రీపురము. అది పల్లెటూరు. చక్రపాణి పెండ్లికూఁతుం జూడకుండ నుండవలయునని ప్రతిజ్ఞ చేసికొనియెను. చక్రపాణి పినతల్లి మేనత్త కొడుకులు, ఆతని తల్లి యాఁడుబిడ్డ మనుమలు, ఆతని తండ్రి బావమరది మేనల్లుడు కొడుకులు ఇట్లే చాలమంది బంధువులా పెండ్లికి వచ్చిరి. కాని, చక్రపాణి యెవ్వరితోను మాటాడలేదు. పెండ్లికూఁతుం దల యెత్తి చూడలేదు. పెండ్లి యయిపోయినది. తిరిగి భద్రాచలము వచ్చిరి. మన్నుగుడుపులయినవి. స్నేహితులందఱును పెండ్లికూ



తు రెట్లున్నదని చక్రపాణి నడిగిరి. కాని, యాతఁ డేమియుఁ జెప్పలేదు. భద్రాచలమునకు వచ్చిన తరువాత చక్రపాణి వెంటనే రాజమహేంద్రవరమున కేగెను. అప్పటి కింకను నెలదినములు సెలవుండెను. కాని, యొక్కగడియయయినఁ జక్రపాణి భద్రాచలమున నిలువలేదు.

---

## నాలుగవ ప్రకరణము.

---

రాజమహేంద్రవరమునఁ జక్రపాణి వెనుకటి మేడలోనే బసచేసెను. మునుపటి మేడలోనె సుందరుఁడు, రోహిణియు నుందురని యాతఁ డెఱుఁగును గాని యాతఁ డింకను వారిం జూచుటకేగియుండలేదు. ఒకదినము మధ్యాహ్నమున మేడమీఁదఁ జక్రపాణి యేదో పుస్తకముం జదువుచుండఁగ నట్లే నిద్దురపట్టెను. ఇంతలో గోడచాటున నిద్ద కంఠస్వరములు వినఁబడియెను. సుదర్శనుఁడు రోహిణి చేఁగుఁ బట్టుకొని యీడ్చుచుండెను. రోహిణి వచ్చుటకు సి పడుచుండెను. ఆ యలుకుడునకుఁ జక్రపాణి యులికిపడి లేచెను. బయటఁ జూడఁగా నాయిరువురుఁ గాన్పించిరి. చక్రపాణి నిర్ఘాంతపడెను. ఆతని హృదయమున నేమో భయము

గలిగెను. గుండెలు దడదడఁ గొట్టుకొనియెను. రోహిణీసుదర్శనులు వెనుకటివలె లేరు. ఇప్పుడు వారియొడలఁ బసుపుబట్టలు. ఫాలములఁ గల్యాణరేఖలు. వస్త్రముల బ్రహ్మముడులు. సుదర్శనుని భుజముపై నుత్తరజందెములు — చక్రపాణి విభ్రాంతచిత్తుఁడయ్యెను. నోటమాటరాక నిలుఁబడిపోయెను. రోహిణి సిగ్గుపడి తలవంచుకొనియెను. సుదర్శనుఁడు నవ్వుచు "చక్రపాణీ! చూచితివా! నీవు పెండ్లిజేసికొనివచ్చులోపల నన్నును రోహిణిని నీరాజమహేంద్రవరమునఁ గట్టివైచినారు. ఇంతలోఁ బోక —"

రోహిణి చెప్పవద్దని సుదర్శనునివంక బొమలుముడివైచి తీక్ష్ణముగఁ జూచెను. కాని, సుదర్శనుఁ డాగలేదు. అతఁడు — "ఇంతలోఁ బోక నన్నీరోహిణి నేఁడు కృష్ణుఁడు తనకుఁగట్టినరోటిని లాగికొనివచ్చిన ట్లిచ్చటకు లాగికొని చ్చినది." అనియెను. రోహిణికిఁ గోపమువచ్చినది. చురచుర సుదర్శనునివంకఁ జూచెను. సుదర్శనుఁడు పకపక నవ్వుచుండెను. చక్రపాణి యేమియు ననలేదు. చూచుచుండెను. రోహిణి సుదర్శనునుండి విడిపించుకొని పారిపోఁబోయెను. కాని, సుదర్శనుఁ డామెబట్ట గట్టిగఁ బట్టుకొనియెను. సుదర్శనుఁడు మరల నవ్వుచు — "ఈమారు క్రొత్త పెండ్లికొడుకగు చక్రపాణిం జూచినతోడనే యీక్రొత్త పెండ్లికూఁతురకు సిగ్గువచ్చుచున్నదికాఁబోలును" అనియెను. ఈమారు రోహిణి కోపమాపుకొనఁజాలకపోయెను. ఆమె వేగముగ నచ్చటినుండి పారిపోయెను. సుదర్శనుఁడుగూడ నామె వెంటనే వెడలిపోయెను. చక్రపాణిగుండె నీరయ్యెను. అతఁ డప్రయత్నముగ నచ్చటిశయ్యపైఁ బడిపోయెను. కన్నులు మూసికొనియెను. సర్వము నాతని కంధకారముగ నున్నట్లుండెను. ఆతని హృదయ మంధకారపూరితమయ్యెను.



అంధకారసముద్రము విచిత్రవిషవాహినీసమాదాయముచే నేర్పడును. ఎవ్వఁడు విషవాహినీజలములఁ బానము చేయుచుండునో, వానిహృదయము క్రమక్రమముగ అంధకారసముద్రమగును. కృష్ణవర్ణయగునాహాలాహలము వాహినీరూపమునఁ బ్రవహించి యంధకారసముద్రముగ నేర్పడును. దానినిద్రావుట కెవ్వరును సందేహింపరు. అది యానందప్రదర్శిని. దానియాకారము సౌమ్యమై మనోజ్ఞమై యుండును. దానిజలము విషమువలె నుండదు. అమృతముకన్న నతిమధురమై యుండును. దాని నికనెవ్వరు విసర్జింపఁజాలువారు? ఆవిషవాహినీజలపానము నొనర్పకుండ నెవ్వరుండఁగలరు? అట్టివారిగతి తుదకేమగునో చెప్పఁజాలము.

చక్రపాణి యట్టివిషవాహిని నాశ్రయించియుండె

ను. ఆవిషవాహినీప్రవాహము నోకించుక పానముఁ జేసెను. రోహిణి మనోజ్ఞముఖమండల మాతనిహృదయమున విష బిందువులఁ జిలికెను. ఆవిషబిందువులు ప్రళయాగ్నికన్న ననేకముగ హృదయముం గాల్చివేయును. చక్రపాణికి రోహిణియెడఁగలప్రేమ యగాధమయినది. కాని, యట్టిప్రేమ క్రమక్రమముగఁదన్నీవిషవాహినిలో ముంచునని యాతఁడు తలంపలేదు. బాల్యమునందలి యాతనిపవిత్రమగు ప్రేమ క్రమక్రమముగ దురదృష్టవశమున నతిలజ్జాకరమగుమోహముగఁ బరిణమించెను. చక్రపాణి యిదివరలో రోహిణీసుదర్శనులయవ్యాజవాత్సల్యము నెఱుంగును. అది యువయువతీప్రణయము—వారియుభయులకుఁ దనయెడల నతీతమగుసోదరవాత్సల్యముగలదనికూడ నెఱుంగకపోలేదు. సహజముగ నట్టివాత్సల్యము లోకమున నెచ్చటనుండదు. తానెవ్వరిపైనాసలునిల్పియుండెనో—అట్టివారిహృదయము వేఱెచ్చటనో లగ్నమైయున్నదని తెలిసినప్పుడు—అదియెచ్చటలగ్నమైయున్నదో యచ్చట పరిపూర్ణమగుక్రోధభావము నిలుచుచుండును. కాని, సుదర్శనునిపైఁ జక్రపాణికిప్పుడేమాత్రమును గ్రోధభావము కలుగలేదు. అన్యోన్యము సుదర్శనునకును రోహిణికినిగలప్రణయభావముల నెఱిఁగియున్నను తనహృదయ మట్టిభావములకు లోనయిన



ప్పు డాతఁడు లజ్జాభావమునకు లోనయ్యెను. తనచిత్తము పాపపంకిలమైయున్నను, నిజభార్యను లజ్జవదలి తనకుఁ జూపుటకైఁ గొనివచ్చినసుదర్శనునిసరళభావమున కాతఁడు సిగ్గుపడి తలనెత్తఁజాలకపోయెను. రోహిణి తన్ను కేవలము సోదరునికన్న నెక్కుడుగఁ బ్రేమింపఁజాలదని యాతఁ డెఱుంగును. కాని, యాతనిహృదయ మేటికట్టిపాపభావమునకు లోనయ్యెనో తెలియలేదు. అతఁడు తనభావము నెవ్వరికిని దెలియఁబఱుపఁదలంచుకొనలేదు. ఇఁక దానాయింటనేయుండినట్లయినఁ బ్రతిదినము రోహిణీముఖదర్శన మగుననియుఁ దనకు దినదిన మట్టిభావములే సముద్భూతములగుననియు, నింతటినుండియుఁ దాను రోహిణీముఖమునైనఁ జూడరాదనియుఁ దలఁచెను.

మఱునాఁడు చక్రపాణి తనబస నుల్లితోటవీథిలోనికి మార్చుకొనియెను. ఆతఁడు పాఠశాలయందుసయితము రోహిణీసుదర్శనులతోఁగాని, సుందరునితోఁగాని, యంతగా మాటాడక కాలేజివదలఁగనే వారికన్నముందో, వారు వెడలిపోయినతరువాతనో, యింటికివచ్చుచుండెను. ఇంతలోనే చక్రపాణిహృదయ మింతగమారిపోవుట కేమికారణమో వారికిఁ దెలిసినదికాదు. ఒకదినమునఁ జాలఁ బ్రొద్దుపోయినతరువాతఁ దీరుబడి చేసికొని రాత్రికాలమున సుందరుఁడు చక్రి

పాణి యింటికిఁ బోయెను. చక్రపాణి యప్పుడు పరుండియుండెను. ప్రక్కన దీపము వెలుఁగుచునేయుండెను. ఆతనికట్లే నిద్దురపట్టినది. సుందరుఁడు చక్రపాణి మొగమును జూచెను. అది యనేకములగు నారాటములచేఁ గలుషితమైయున్నట్లు స్పష్టపడుచుండెను. ఇఁక నాతఁడు చక్రపాణిని లేపి ప్రశ్నింపఁజాలక పోయెను. మెల్లగ వచ్చినత్రోవఁబట్టి యింటికేగెను. ఇంటికేగఁగనే రోహిణి "అప్పుడే మరలవచ్చితివేమి?" అని యడిగెను. సుందరుఁ డిట్లనియెను. "చక్రపాణి నిద్రించుచున్నాఁడు. ఆతనిహృదయము కల్లోలమైయున్నట్లున్నది. ఆతనిముఖలక్షణములు విలక్షణములుగానున్నవి. నేనిఁక నాతని లేపఁజాలక, తిరిగివచ్చితిని." —

రోహిణిహృదయము తల్లడిల్లిపోయెను,

---

## ఐదవ ప్రకరణము.

---

రోహిణిహృదయము తల్లడిల్లిపోయెను. కాని, యామె యెవ్వరితో నేమియు ననఁజాలక పోయెను. వివాహమయిన తరువాత రోహిణి కొన్నిదినములు కాలేజికేగెను. కాని, తరువాత రోహిణి బడికేగుట యాపివేయఁబడియెను. ఆ



మొకఁ జక్రపాణి కాన్పించుట లేదు. ఏకారణముననో అన్న మరల నక్కడకుఁ బోలేదు. తనభర్తయగు సుదర్శనునితో నామె యేమిచెప్పును? ఒకపురుషునిగూర్చి యంత యారాటముతో నుండుటఁ జూచిన నాతఁ డేమనుకొనును? మఱియు వివాహమయినతరువాత సుదర్శనునితో రోహిణి యంతగా సంభాషించుటమానెను. రోహిణి గత్యంతరముఁగానక హృదయముననే క్షోభపడుచుండెను.

క్రమముగఁ గొన్నిదినములు గడచిపోయినవి. శీతకాలపుదినములు గడచి తిరిగి వేసవి ముదురుచుండెను. కాలేజిలోనుండఁగనే చక్రపాణికిఁ దండ్రియొద్దనుండి తంతివార్త వచ్చెను. "నాకు రాచపుండయినది. బ్రదుకుట దుర్లభము. తక్షణము బయలుదేరవలసినది" అనియుండెను. చక్రపాణిమొగము వెలవెలఁబాఱెను. ఆ వార్త వెంటనే కాలేజియంతటఁ దెలిసెను. చక్రపాణికి సెలవు వెంటనే యిచ్చిరి. కాని, రాజమహేంద్రవరమునుండి భద్రాచలమునకు రావలయునన్న సామాన్యముగాదు. గోదావరిమీఁద పడవపైఁ బ్రయాణముచేయవలెను. ఎండలు ముదురుచున్నదినములు. ఎదురుపోవలసినపడవ ఆదినములలో సాధారణముగఁ బదిపండ్రెండుదినములకుఁగాని గమ్యస్థానముచేరలేదు. ఈ దిక్కుమాలినప్రయాణములోఁ దనతండ్రిజీవితమే మైపో

వునోయని చక్రపాణికిఁగలిగినమూర్తి మింతగాను. కొందఱు సింగరేణిమార్గమున నేగుమని చెప్పిరి. దానికి బెజవాడకేగి యచ్చటినుండి నిజామువారిమార్గమున రావలయును. ఆ సింగరేణిలో సమయమునకు బండిదొరకకున్న నచ్చోఁ జావవలసినదే! వీనినన్నిటిని యోచించుకొని యేమైనను మంచిదేయని చక్రపాణి సింగరేణిమార్గమునఁ బోవుటకే నిశ్చయముచేసికొనియెను. రాత్రి బెజవాడ మెయిలునకేగునప్పుడు చక్రపాణి, చెప్పిపోవుటకై రోహిణియింటికివచ్చెను. రోహిణి నాఁటికి తిరిగి నేఁడే చక్రపాణిఁ జూచినది. రోహిణితల్లిదండ్రులు చక్రపాణితండ్రిస్థితికిఁ జాలవగచిరి. రోహిణి యీసమయమునఁ జక్రపాణి విచారవిషయమును దానే యడుగఁదలంచెను. కాని, యిది యీ సమయము? ఆతఁ డేమనుకొనును? చూచువారి కేమంత బాగుగనుండును? రోహిణియడుగలేదు; చక్రపాణి వెడలిపోయెను. మఱునాఁడు పగలు పదునొకండుగంటల కాతఁడు సింగరేణిలో దిగెను. భోజనముచేసి యాతఁడు బండికై ప్రయత్నింపఁగా బండిదొరకలేదు. చక్రపాణికి తండ్రిరోగ మెట్లున్నదో యనునాందోళన మెక్కువగానుండెను. ఆతఁ డింక నచ్చట నాలస్యముచేయక కూలివానినొకనిమాటాడుకొని మూటముల్లె పట్టించుకొని నడచి రెండుదినములకు భద్రాచలము



చేరుకొనియెను. చక్రపాణి భద్రాచలమునకు వచ్చుసరికి తండ్రికి మాటగూడ గొణుఁగుపోయినది. తెలివి సగముతప్పినది. తండ్రికొడుకు లొకరినొకరు కౌఁగిలించుకొనిరి. కాని, యేమిలాభము? ఆనాయంకాలమే మఘసూదనుఁడు ప్రాణములనువిడిచెను. చక్రపాణి తండ్రియెడల నతిప్రేమగలవాఁడు. ఆతఁ డూపిరియైనవిడువకుండ మూఁడుదినములలో భద్రాచలమునఁ జేరెను. ఆతఁడు వచ్చునప్పుడు దారిలోనున్న తనయత్తవారియూరగు శ్రీధరమును దాఁటియే వచ్చెను. కాని, యచ్చటనైన నిలువలేదు. అర్ధరాత్రమున నాయూరినాఁగక దాఁటివచ్చెను. కాని, మఘసూదనుఁడు పెద్దవాఁడు; ఆయుష్కాలము చెల్లిపోయెను.

## ఆఱవప్రకరణము.

---

తండ్రిమరణానంతరమునఁ జక్రపాణియే గృహాధికారి యయ్యెను. కాని, యాతఁడు బాలుఁడు. వ్యవహారముల నన్నిటిని దిన్నగఁ జక్కఁబెట్టుకొనఁజాలఁడు. చక్రపాణి నొకగుమాస్తానేర్పఱచుకొనియెను. గుమాస్తా వ్యవహారముల నన్నిటిని తిన్నగనే చూచుచుండెను. ఇఁకఁ జక్రపాణికి తిరిగి రాజమహేంద్రవరము వెళ్లుటకు మొగము చెల్లినదికాదు.

వృద్ధురాలగు నాతనివిధవతల్లి “నాయనా! మీతండ్రిగారు తమకాలము నెటులో వెళ్లఁబుచ్చుకొనిపోయినారు. మనకున్నధనమును, రాఁబడియుఁ జాలును. నీవే దేశములకో వెళ్లి చదువుకొని యుద్యోగములఁ జేయనక్కఱలేదు లెమ్ము.” అనియేడ్చెను. చక్రపాణియభిప్రాయముగూడ దానితో నేకీభవించినది. అందువలన నాతఁడు తండ్రిమరణానంతరముఁ జదువుకొనుటకు తిరిగి రాజమహేంద్రవరమునకు వెళ్లియుండలేదు. మధుసూదనుఁడు దినవారములకు శ్రీపురమునుండి చక్రపాణి భార్యయగుసీతను వెంటఁబెట్టుకొని యాతనియత్తమామలు భద్రాచలమువచ్చిరి. కాని, యిప్పుడయినఁ జక్రపాణి భార్యమొగమును జూడలేదు. దినవారములయినతరువాత వారందఱును తిరిగి శ్రీపురమున కేగిరి.

చక్రపాణికిపనిపాటలు లేకుండుటచే మఱింత విచారణమయ్యెను. కాలేజిలోఁ జదువుకొనునప్పుడు కొంతకాలమాయిన హృదయము వేఱువిధముగఁ బరివర్తించుచుండెను. కాని, యిప్పుడు కేవలము కేళీవిచారము—సాయంకాలమున మాత్రము రంగారావువచ్చినప్పుడు కొంతసేపు తమచిన్ననాఁటిచర్యలంగూర్చి వారు సంభాషించుకొనుచుండిరి. ఇట్లుండ నొకదినమునఁ జక్రపాణి రంగారావుంజూచి “రంగారావూ! నేను నిరుద్యోగినై యీయూర నూరకఁ గూర్చుం



డు టేమంత బాగుగనున్నది?” అనియెను.

“కలిగియున్నవాఁడవు. నీకేమి పాణీ! నిన్నుద్యోగము చేయలేదని యెవ్వరందురు?—”

“అదికాదు. ఉద్యోగము పురుషలక్షణము. కావున నేనెట్లయిన నేదో యొకయుద్యోగముఁ జేయనేగెదను. ఊరకే కూర్చుండుటవలన మనోవికాసమంతగాఁ గలుగుటలేదు. కొన్నిదినములకు నాకేదియో వ్యాధికూడ రావచ్చునని తోఁచుచున్నది—”

“అట్లయిన నేనేమి వారికడ్డముఁ జెప్పఁగలను? కాని, యిప్పుడీయూర నుద్యోగము లభింపవలయుననినచోఁ జాలఁ గష్టము. తహసీలుదార్లకిళ్లీ లెత్తుకొనియు, సిరస్తాదారుల పిల్లలకుఁ జదువులుజెప్పియు, వారియిండ్లలోనికిఁ గూరగాయలు తెచ్చిపెట్టియు, నిట్లుద్యోగములకొఱకు కష్టకష్టములఁ బడియు నిరర్థకులగుచున్న నిర్భాగ్యుల నెందఱినో చూచుచున్నాము. నీవట్టిపనులం జేయలేవు. సుకుమారివి—”

“ఈయూరిలోఁగాదు. వెంకటాపురమున నుద్యోగముగలదని మనవాఁడేయొకఁ డుత్తరము వ్రాసినాఁడు”

“అట్లయిన నీయిష్టము. కాని, నీకుద్యోగముఁ జేయకున్న జరుగకపోదు”

తుదకుఁ జక్రపాణి వెంకటాపురమునకే పోవుటకుఁ

గృహనిర్బంధముఁ జేయ్యెను. మురళితల్లి మగల నేడ్చెను. కాని, తనయొద్దనున్నలనఁ గుమారునకుఁ గష్టముతోఁ జుటచేఁ దుదకు సమ్మతింపవలసినదయ్యెను. చక్రపాణి హృష్టచిత్తుఁడై యంతటితోవ సెంపుఁదీకొని యొకనాఁటిరాత్రి శకటముపై వెంకటాపురమునకు బయలుదేరిపోయెను. ఆనాఁటిరాత్రి యిఁకనెన్నిదినములకు మరలివత్తునోయని చక్రపాణి రంగారావుతోఁ గూడ శ్రీరామాలయమునకేఁగియుండెను. భక్తిభావముతో వారు భగవంతుని సేవించిరి. తుదకు రంగారావు చక్రపాణింజూచి యిట్లనియెను. పాణీ! చిన్ననాఁటినుండియు నీకన్ని సద్గుణములతోఁ బాటు దైవభక్తి కూడఁ గలదని నేనెఱుంగుదును. కాని, నేనిప్పుడు చెప్పఁబోవు వాక్యములుఁగూడ సావధానముగ వినుము. భగవంతునిధ్యానము నేమఱకుము. ప్రతిదినమును నీకుఁ దీఱికయగువేళ భగవంతుని ధ్యానింపుము. మనము జన్మించినది కలియుగ వైకుంఠమగు భద్రాచలక్షేత్రము. శ్రీరంగము, రామేశ్వరము మొదలగు క్షేత్రములందలి జనులు మనము భద్రాచలవాసులమగుటచే నెంతోపుణ్యాత్ములమని భావించుచున్నారు. కాని, మనయూరిలో మాత్రి పట్టిభక్తిభావముతోఁ జరించువారెంతోమంది లేరు. కొందఱు శుక్రవారమండపమునకు కేవలము స్త్రీలకొఱకు వత్తురు. చాలమంది దేవునిసన్నిధినిఁగూర్చుం



డినప్పుడుసయితమర్చకులనో, మఱియెవ్వరినో తిట్టుచు పులిహోరము మొదలగునవి వినియోగింపఁబడునప్పుడు పళ్లెరములకెగఁబడుట మొదలగు పాపకార్యము లొనర్చి యదియెంతో ఘనకార్యమని యుప్పొంగిపోవుచున్నారు. చాలమంది దేవాలయమునఁ జుట్టలు, సిగరెట్లు కాల్చి యాధూమముచే శ్రీరామచంద్రు నర్చించుచున్నారు. కాని, పాణీ! నేనెఱుఁగుదును. మొదటినుండియు నీవు సజ్జనుఁడవే! ఈకల్యాణమూర్తి సేవ మఱకుము. ఇహ మెంతోకాలముండదు. శాశ్వతమగు పరలోకమునకై మనమిప్పుడే పుణ్యమును నిలువఁజేసికొనవలయును. వెంకటాపురమునకు సమీపముననే " మల్లూరు " అనుపురము, అందు శ్రీనృసింహదేవుఁడును గలడఁట! వీలగునేని యాదేవునిఁగూడ దర్శించి రమ్ము. నాపలుకులను మఱకుము. ఇంతగాఁజెప్పినందులకు నన్ను క్షమింపుము. ఈదీనుని కెడనెడ నుత్తరములను మాత్రము వ్రాయుచుండుము.

విజ్ఞానవంతములగు రంగారావు వాక్యములను చక్రపాణియెన్నఁడును మఱవనని శిరసావహించెను.

---

## ఏఁడవప్రకరణము.

---

వెంకటాపురము భద్రాచలమున కుత్తరముగ నేబది మైళ్లదూరమున నున్నపల్లె. ఈప్రదేశమంతయుఁ బూర్వము సెంట్రలుప్రావిన్సెసు (C. P.) లోఁ జేరియుండెను. కాని, గోదావరిజిల్లానుండి యేలూరు, యెర్నగూడెము, తణుకు తాలూకాలు, కృష్ణాజిల్లాలోఁ జేరినపిమ్మట నీప్రదేశము గోదావరిజిల్లాలోఁ గలుపఁబడియెను. అప్పుడీవెంకటాపురము తాలూకా యేర్పడియెను. ఇది క్రొత్తగఁ గట్టఁబడుచున్నది. గవర్నమెంటువారియిండ్లును కచేరీలును, చాలఁగలవు. మిగిలినగ్రామ మంత పెద్దదికాదు. ఇది గడుమన్యమగుటచే సాధారణముగ నందఱు నిచ్చటికిఁ బోవవెరతురు. ఇచ్చటికి గోదావరి నాల్గుమైళ్లదూరములో నున్నది. ఆగోదావరీజలము గ్రామస్థుల కుపయోగింపదు. ఇఁక నుపయోగించునది నూతినీరు; అది సుద్దకట్టునీరు; మిగులఁ గాక—దీనివలననే యందఱు కిచ్చటనివసించుటయనిన నెంతయోభీతి. అట్టివెంకటాపురమునఁ జక్రపాణి ప్రవేశించెను.

చక్రపాణి కుద్యోగములభించినది. కొన్నిదినములు తిన్నగ జరిగెను. మొదటిదినములలోఁ గ్రొత్తగఁగట్టఁబడుచున్నగృహములు, బాటలు మొదలగువానిం జూచి యానందమయహృదయుఁడై దినములఁ గడపెను. కాని, తిరిగి వెనుకటిహృదయమే.



ఇప్పటికి సంపూర్ణముగఁ జక్రపాణి విషవాహినిలో మునిఁగి స్నానముచేయుచుండెను. కాని, యాస్నానాంతమున నాతఁడు హాలాహలమిళితజలసంసేవన మొనర్పకుండ నుండఁజాలకపోయెను. దానిని సేవించెను. త్రాగునప్పుడు తీయగనుండును విషవాహినీజలము. తలకెక్కినతరువాత మత్తునుగలుగఁజేయును. స్మృతియుండనీయదు. సారాయము దానియెదుటఁ బనికిరాదు.

ఒకవస్తువునందే యమృతమును విషమునుగూడ నుండును. లేదా, ఉపయోగక్రమమున నదియే యొకని కమృతమగును. వేఱొకనికి విషమగును. అట్లే ప్రణయమునందుఁ దేజమును, అంధకారమునున్నవి. ఏకపక్షప్రణయము విషవాహినీసదృశము. తుదకది మోహాంధకారసముద్రమగును. ఉభయపక్షప్రణయ మమృతప్రవాహసదృశము. దానియందే జ్యోతిస్సముద్రమున్నది. విమలమైయుండు నాసంపూర్ణప్రణయము త్రొలుదొల్తనే సఫలమగునేని యంతకన్న మధురామృతము, అంతకన్నస్వర్గము మఱియెక్కడను లేదు. ఏకపక్షప్రణయము, లేక మోహమునకన్న విషవాహిని, కాక-మరణము మఱియొకటి లేదు. చక్రపాణికిఁ బ్రియతమమైనది—

ప్రణయమా! కాక మరణమా! ఇట్టిభావములను మరల్చుకొనుటకే చక్రపాణి వెంకటాపురమునకు వచ్చియుండెను. కాని, యాతనియూహ మహాప్రవాహమును చేతులతో నాపుటవంటిది. కేవల మెండవలన సుందరహర్మ్యమును గాల్చివేయుటవంటిది. ఈవిషవాహిని సామాన్యమయినదిగాదు. కొన్నివేళల రంగారావు చెప్పినహితము ననుసరించి చక్రపాణి దైవమువంక దృష్టిమరల్చుచుండువాఁడు!

కొన్నినాళ్లకు రోహిణీసుదర్శనులును సుందరుఁడును గలిసి యాతని కొకయుత్తరమును వ్రాసిరి. ఆయుత్తరముం జూచినతోడనే చక్రపాణిహృదయము భగ్నమండిపోయెను. అట్టి యాయుత్తరమును దీపపువెల్గునఁ గాల్చివేసెను. దానికిఁ బ్రత్యుత్తర మీయలేదు. ఇంకఁగొన్నినాళ్లకింకొకయుత్తరము—మఱియొకయుత్తరము—

ఎన్నియుత్తరములనైన నగ్నిహోత్రప్రీతములుగఁ గావించుటతప్పఁ జక్రపాణి దేనికిని బ్రత్యుత్తరమునీయలేదు.

---



## ఎనిమిదవప్రకరణము.

చక్రపాణితల్లికి జబ్బుగానున్నదని యుత్తరము వచ్చెను. కాని, చక్రపాణి పోలేదు. సెలవుదొరకలేదని వ్రాసెను. ఆమెకుఁ గోపము వచ్చెను. కొన్నినాళ్లకామె వ్యాధి నిమ్మళించెను. కాని, క్రోధముమాన లేదు. ఈలోపలఁ జక్రపాణిభార్య రజస్వలయైనట్లు శుభలేఖ వచ్చెను. ఆతనితల్లి తొందరపడియెను. శీఘ్రముగఁ గార్యముఁ గావించినట్లయినఁ గుమారుఁ డొకయింటివాఁడగుననియు, తానుగూడఁ దనభర్తవలెనే యెప్పుడో యిహలోకమును విడవలసినదేయనియు నూహించి కుమారున కుత్తరము వ్రాసెను. పునస్సంధానమింతత్వరలో జరిపింపనక్కఱలేదనియుఁ దనకు సెలవుదొరకుట లేదనియుఁ జక్రపాణి ప్రత్యుత్తరమిచ్చెను. అతనితల్లికెంతో కోపము వచ్చెను. కాని, కన్నకడుపుగదా! ఎన్నినాళ్లకోపము! కొన్నిరోజులకుఁ దిరిగి యామె కుమారునిచేర నుత్తరము వ్రాసెను. తనకింటఁ బనిచేసికొనుటకుఁ దీరిక లేదనియు, కోడలి నింటికిఁ దెచ్చెదననియు వ్రాసెను. తీరిక లేకున్న నింకొకపరిచారికనైనఁ బెట్టుకొమ్మనియుఁ గోడలి నింటికిఁ దేవలదనియుఁ జక్రపాణి ప్రత్యుత్తర మిచ్చెను. తల్లి యీమాటకెంతో యాగ్రహపడియెను. కోడలి ని

టికిఁ దెచ్చిపెట్టుకొనియెను. ఆవార్త కుమారునకు వ్రాసెను. చక్రపాణికిఁగూడఁ దల్లిపైఁ గోపము వచ్చెను. తల్లికొడుకులకు మనస్పర్థలు పెఱిఁగెను. చక్రపాణికి బింక మెక్కువయయ్యెను. భార్యపై మమత్వమధికమయ్యెను. ఇంటికేగినను భార్యనుచూడఁగూడదని యాతఁడు నిర్ధారణచేసికొనియెను. కార్తిక శుద్ధ సప్తమినాఁడు గుమాస్తాయొద్దనుండి చక్రపాణికిఁ బిడుగువంటి యుత్తరము వచ్చెను. చక్రపాణి తల్లికి నాలుగుదినములు జ్వరము వచ్చి, నాల్గవదినమున రోగ మెక్కువయయ్యెనని యందుండెను. చక్రపాణికిఁ దల్లిపైనున్న క్రోధమంతయు నెగిరిపోయినది. తక్షణము బయలుదేరవలెనని తలంచెను. సెలవుకూడ దొరకినది. కాని, పోష్టదమనిన బండి యెచ్చటను దొరకలేదు. ఆదినముకూడ గడచిపోయెను. మఱునాఁడు రంగారావు పంకొక యుత్తరమును వ్రాసెను. దానిలోఁ జక్రపాణితల్లి బ్రతుకుననునాశ యెవ్వరికి నిలేదని యుండెను. చక్రపాణి యత్యాక్రముతో వెంకటాపురమెల్ల గాలించెను తుట్టతుద కొకగూడు లేనిబండి దొరకెను. ఆదేశపుబండ్లకినుపయిరుసులు వేయరు. ఏ పిరుమానుకఱ్ఱతోనో యొక యిరుసుచేసి బండ్లకుఁ దగిలింతురు. చక్రపాణికి దొరకినదికూడ నట్టిబండియే. సుబ్బముపేటద్దరికి వచ్చినతోడనే యాకొయ్యయిరుసు విరిగిపోయెను. బండి



మూలనుబడినది. చక్రపాణి మాఱుమాటాడక కూలివానినొకనిఁదీసికొని, తిండితిప్పలు లేకుండ నేకాయేకి నడచి యారాత్రికిఁ బర్ణశాలవచ్చి యచ్చటిసత్రమున నింతతిండితిని తిరిగి వెంటనే బయలుదేరి యారాత్రివెన్నెలలో నడచి పండ్రెండుగంటలకు భద్రాచలము వచ్చెను. పాపము చక్రపాణిదురదృష్టమేమోకాని, ఆతఁడువచ్చుసరికి తల్లికి మతితప్పెను. సాయంకాలమునుండియు సన్నిగుణములు గాన్పించుచుండెను. వైద్యులనప్పుచుచేయుచుండిరి. రంగారావును గుమాస్తాయుఁ జాలకష్టపడుచుండిరి. కుమారుఁడు రాఁగానే తల్లి బావురుమనియేడ్చెను. చక్రపాణిహృదయము శతధా వ్రీలిపోయెను. ఇన్నిదినములనుండియు నాతఁడనవసరముగఁ బెంచినమనస్పర్థలకుఁ దగినపశ్చాత్తాపముం బొందెను. మాతృభక్తి యాతనిహృదయమునఁ బరిపూర్ణమై యుండెను. ఆతనిమాతృదేవత యాతెల్లవారుజామున నస్తమించెను. ఆవార్త తెలిసినతోడనే యాతనిబంధువులందఱు నూరూరినుండియుఁ గాకులవలె వచ్చిచేరిరి. దినవారములైపోయినవి. చక్రపాణిమామకూడవచ్చెను. ఆయన యొకనాఁడు చక్రపాణింజూచి " ఇంటిలోనున్న పెద్దదిక్కుపోయినది. ఇకనైన భార్యతో నిల్లు కనిపెట్టుకొనియుండు " మని చెప్పెను. చక్రపాణి యనిష్టభావముతో మామనుజూచి,

"మీకిష్టమున్న నిచ్చువచ్చి పొండు. లేకున్న మీయింటికిఁ గొనిపొండు. నేను వెంకటాపురముఁ దప్పకపోయెదను" అనియెను. మామగారిఁక మాటాడలేదు. వినీతుఁడగు తన పెద్దకుమారుని సీతం దోడుకొని శ్రీపురమునకు వెడలిపోయెను. సీతయు, సీతయక్కయును, మామయు భద్రాచలమున నుండిరి. తిరిగి చక్రపాణి వెంకటాపురమునకుఁ బ్రయాణముఁ గట్టుచుండెను.

---

## తొమ్మిదవ ప్రకరణము.

---

చక్రపాణికి భద్రాచలమున బాల్యస్నేహితు లనేకు లుండిరి. కాని, యంతరంగస్నేహితుఁడును, మిత్రశ్రేష్ఠుఁడును రంగరావొక్కఁడు మాత్రమే. అతఁడు చక్రపాణి వచ్చిన దిమొదలు ఒక్కనిముసమైన నాతని నెడఁబాయలేదు. పొద్దున భుజించినపిమ్మట మధ్యాహ్నము వఱకు వారు భోజనములమాట మఱచి చక్రపాణియింటనే యుండుదురు. ఒంటిగంట తిరిగిపోయిన తరువాత నెవ్వరైన జ్ఞప్తికిఁ దెచ్చినచో వారు భోజనమునకుఁ బోవుదురు. ఒక్కొక్కనాఁడు రంగారావు భోజనమునకేగకయే యుండును. ప్రతిదినము సాయంకాలమున వారు శ్రీరామాలయమున కేగుచుండి రాత్రికి గృహాభిముఖులగు



చుండిరి. రాత్రికాలమునఁ గూడ వారెడఁబాసి స్వగృహముల కేగునప్పుడు చాలవిచారముతో నొండొరులు వీడ్కొలుపుకొనుచుండిరి. ఒకదినమునఁ జక్రపాణియు రంగారావును, శ్రీరామచంద్రుని దర్శించి గృహాభిముఖులయిరి. చక్రపాణి తన యిల్లుదాటి యింకను రంగారావుతోనే చాలదూరము వచ్చెను. రంగారావాతని నింటి కేగుమని బలవంతపెట్టుచుండెను. కాని, యాతఁ డామాటను వినలేదు. చక్రపాణి యానాఁ డేదో యొకమాటను రంగారావుతోఁ జెప్పుటకై ప్రయత్నించుచుండెను. కాని, నోటివఱకు వచ్చినమాట తిరిగిపోవుచుండెను. తుదకూరిచివరనున్న ధర్మవైద్యశాలవఱకును వారిరువురుఁ గలసియే వచ్చిరి. అచ్చటితిన్నెమీఁద నిరువురుఁ గూర్చుండిరి. చక్రపాణిహృదయము కల్లోలమైయుండెను. చాలఁదడవు విచారించి యాతఁడు గుండెదిటవుఁ జేసికొని "రంగారావూ! నేనిఁక నెన్నినాళ్లలో జీవింపఁజాలనని తోఁచుచున్నది." అనియెను. ఇట్లనినప్పుడు పాణిహృదయ మెంతో క్షోభించెను. రంగారావదరిపడియెను. ఆమాటయందలి పరమార్థమేమో యాతనికొకింతయిన బోధపడినదిగాదు.

"అదేమిపాణీ! అశ్లీలము లేలవచ్చుచున్నవి? అదేమిమాట—"

దానికి మాఱుమాటఁ జెప్పక చక్రపాణి చాలసేపట్లే

యూరకుండి పిమ్మటఁ గన్నీరుఁదుడుచుకొని "రంగారావూ! అంతే! నామాటనిజమే! నేను బ్రిదుకను" అనెను. రంగారావు చెవులుమూసికొనియెను. అతఁడాకఠినవాక్యములను వినఁజాలకపోయెను. "రామరామ! నీవిట్టిమాటల నాడుచున్నావేమి? నీవిచారమేమో చెప్పివేయుము. ఎంతో విచారముగలవారు సయితము మరణమునుగోరుటను జూచియుండలేదు."

చక్రపాణి తనవిచారమునేమో తానే యెఱుంగఁడు. దాని నెట్లురంగారావునకుఁ జెప్పఁగలఁడు?—ఆవిషవాహినీజల మాతనితలకెక్కియున్నది.

"రంగారావూ! ఈవిషయమునే చాలసేపటినుండియు నీతోఁజెప్పవలయునని తలంచియుంటిని. చెప్పివేసితిని. ఇఁక నేనింటికేగెదను" అనియెను.

కాని, రంగారావాతని నంతసులభముగఁ బోనియలేదు. అతనిని నిలిపి "నీవీమాటయొక్కటిమాత్రమే చెప్పిపోయినఁజాలదు. నీవిచారకారణమును తిన్నగఁ జెప్పి యది యుక్తమయినదయినచో నన్నుఁగూడ దానిలోఁ గొంతభాగముఁ గొననిమ్ము. నీతల్లివిషయమై విచారమా! అదికూడదు. ఆమె పెద్దది. నీయొక్కనిచేతిమీఁదుగ నామెముప్పు గడచిపోయినది. తల్లిచనిపోయినవారందఱు నట్లే మరణముం



గోరుకొనుచున్నారా!" అనియెను.

"రంగారావూ! నాకావిషయమునవిచార మేదియు లేదని నమ్ముము. నాకేందువలననో యీలోకమును విడిచిపోయినపిమ్మట సుఖముగలుగునని తోఁచుచున్నది."

"అట్లెన్నఁడును గలుగదు. పాణీ! ఆత్మహత్యవలన నీకానందమెట్లుకలుగును? అదిమహాపాతకమనియెఱుంగవా! నీవట్లొనర్చి నరకమున నతికష్టమునందెదవా?"

"ఆకష్టమే యీవిచారముకన్న నానందదాయకమని తోఁచుచున్నది."

చక్రపాణివిచారమేమో రంగారావునకుఁ దెలియలేదు. ఆగంభీరభావమేమని యాతఁడు తరచియడిగెను. కాని, పాణి చెప్పలేదు. రంగారావు "నీవు దీనిని చెప్పకున్న నేను నీతోమాటాడను" అనిపలికెను. అప్పుడుకూడ పాణి చెప్పలేదు. ఆరాత్రి రంగారావు తాను చక్రపాణితో మాటాడకుండనేపోయెను. చక్రపాణియు నింటికివచ్చెను. రంగారావు మఱునాఁడెప్పటివలెఁ జక్రపాణియింటికి రాలేదు. చక్రపాణి తెల్లపోయెను. నిజముగనే యట్టికోమలహృదయుఁడగు రంగారావునకుఁ దనపైఁ గోపమువచ్చియుండనోపునని నమ్మెను. కాని, సాహసించి తనవిచారమును చెప్పివేయఁజాలకపోయెను. ఆనాఁడు చక్రపాణి యింటికి రాకపోవుటవలన

రంగారావునకుఁగూడ మంత్రిపైనున్నట్లుండెను. కాని, పట్టుదలవలనను, తానాదినమల్లేయున్నట్లయిన తప్పకేమఱునాఁడు చక్రపాణియిచ్చిన హృదయవిచారమును వెల్లడించివేయునను నమ్మకమువలనను రంగారావు చక్రపాణియింటికిఁ బోలేదు.

## పదియవప్రకరణము.

---

చక్రపాణిభార్యయగుసీత సరళహృదయ. ఆమెకోమలహృదయ మతితప్తమగుచుండెను. భర్తనిరాకరణమునెఱింగి యామె యెట్లయిన నాతనికృపను సంపాదించుకొనవలయునను దృఢాభిప్రాయముం గలిగి యుండెను. ఆమె యనేకపర్యాయములు సాహసించి యాతనిపాదములపైఁబడుటకు నిశ్చయించుకొనియుండెను. కాని, యట్లుసాహసింపఁజాలకపోయెను. తుద కాతని కొకయుత్తరమును వ్రాసియుంచెను. దాని నెప్పుడుపంపఁదలంచుకొనినను భర్తవెనువెంట రంగారావే—ఈదినమునమాత్రము భర్తయొంటరిగనే యున్నాఁడు. పరిచారికచే నాయుత్తరమును భర్తయొద్దకంపెను. చక్రపాణి దానిం జదువుకొనియెను. అందిట్లున్నది.

"హృదయేశ్వరా!

అగ్నిసాక్షిగ మీ రేనిర్భాగ్యురాలిని శ్రీపురమున



వివాహమాడియుంటిరో—ఏనిరాధారురాలు మనోవాక్కర్మములచేతను, మీపాదపద్మములనే నమ్ముకొనియున్నదో యాసీత సాహసించి యంపుకొనిన యీవిజ్ఞాపనమును మన్నించి రక్షింపుఁడు! నేను దీనురాలను. నేనెఱిఁగినంతవఱకు నేను మీయెడల దోషమేమియుఁ జేసియుండలేదు. అట్టిదేదైననున్న క్షమింపుఁడు. మీరునాపైఁ బగబూనిన నాజీవించుట యేమిలాభము? నాహృదయ మెంతయకళంకమయియున్నదో, భగవంతుఁడెఱుంగును. నాజీవితమునవెల్ల నేఁగోరునది నన్ను మీపాదదాసిగా ననుగ్రహింపవలయుననియే! మీముఖవీక్షణమునమాత్రమే తృప్తినందెదను. మీపాదసేవవలనఁ గృతార్థురాలనయితినని సంతసించెదను. మీకడ నావంటిపరిచారికలెందఱో పనిపాటలలోఁ దిరుగుచుందురు. వారెంతటియదృష్టవంతురాండ్రు! నాథా! నాకట్టిపరిచారికాజీవనమైన దయచేయుఁడు. నాజీవనములు మీలోనున్నవి. నేను వానిని కేవలము మీకొఱకుమాత్రమే యీ విశాలభూతలమున నిలిపియుంటిని. ఉత్తమస్త్రీకిదియే ముఖ్యధర్మమని నేను వినియుంటిని. దాని నాచరించుచున్నాను.

మీరు వెంకటాపురమందలి నిబిడారణ్యప్రాంతములం జరించుచుండఁగ నాకీయూర నేమిసౌఖ్యముగలుగును? ఈధనము, ఈహర్మ్యములు, ఈపరిచారికాసహస్రముఁ

మీనితో నాకేమి యానందము ? నాకు మీతోడిదే లోకము. మీతోడ నేనరణ్యమునందున్నను నాకది స్వర్గమే. మీరు లేనిస్వర్గమైనను నాకరణ్యసదృశము. ఈయుక్క లేఖను గూడ మీరు నిరాకరించినపక్షమున నిఁకనాజీవితమునకు నీళ్లువదలుకొనియెదను. దీనినిమీమూర్తికి నర్పించియుండుదును. కాని, యీనాశరీరమునుండి ప్రాణవాయువులు వాయులోకమునఁజేరినప్పుడైన నాకు మీపాదసేవాభాగ్యమొకసారి లభించుఁగాక ! నాథా! నన్నుక్షమింపుము. ఈదీనురాలినను గ్రహింపుము ! —

ఇట్లుమీపై మమూర్తికిఁ
బ్రేమఁగలిగియున్నమీప్రియపత్ని —
సీత —"

ఉత్తరమందుకొని చక్రపాణి కన్నులుమూసికొని కొంతతడవేమో చింతించెను. తరువాత నాతఁడు చిన్నపిల్లవానివలెఁ బరుండి దుఃఖింపఁజొచ్చెను.

మఱునాఁడు చక్రపాణి తనకొకయుత్తమాశ్వముగావలయునని గుమాస్తాను తొందరపెట్టెను. గుమాస్తా యశ్వమునుదెప్పించెను. చక్రపాణి రంగారావుతోఁ జెప్పకుండఁగనే వెంకటాపురమున కాయశ్వముపైఁబయలు దేరిపోయెను. ఆతఁ డనివార్యములగునాపర్వతారణ్యమా



ర్గముల నశ్వారూఢుఁడై ప్రయాణముఁజేయునప్పుడు తన లో నిట్లాలోచించుకొనుచుండెను.

" ఆహా ! ఈయరణ్యము లెంత సౌఖ్యకరములయి నవి. ఇహసంబంధములగునీయనంతవిచారములను పోఁద్రోలి యనంతమగుశాశ్వతపదమునకు మార్గదర్శకము లీస్థలము లేకదా ! పూర్వము విమలహృదయులగుసంయమీంద్రులకు నిశ్చలనివాసభూములైయుండిన యిట్టిపవిత్రభూములే ! ఇట్టియేకాంతవాస మెంత సౌఖ్యదాయకమైనది! కాని, యది నాయట్టివానికెట్లు లభ్యమగును ? దానిననుభవించుట కెంతటిపవిత్రచిత్తులుగావలయును ? నాహృదయము కళంకితమైయున్నది. ఇట్టినాకది లభింపదు. ఆయాశ లేదు. నిజమే ! నాకు మరణమునందుఁగూడ నానందము లేదా ? ఉండవచ్చును. నేను దీనినేచూచెదను.

---

## పదునొకండవప్రకరణము.

---

తానుతలంచినట్లుగాక చక్రపాణి చెప్పకుండఁగనే వెంకటాపురమున కేగెనని వినినప్పుడు రంగారావున కపరిమితమగుదుఃఖమువచ్చెను. తానాతనియింటి కామఱునాఁడేగియైన నిజముగనుఁగొనవలయునని రంగారా వూహించె

నేగాని యింతలోనే చక్రపాణియే తన్నట్లు భంగపఱచునని తలంపలేదు. రంగారావున కొకవారముదినములైనతరువాత నొకయుత్తరమువచ్చెను. అందిట్లున్నది.

"రంగారావూ! నీకు నాపైఁ గోపమువచ్చినదా? నేను నీతోఁ జెప్పకుండ దొంగవలె వచ్చుట నాతప్పైనను, నాతప్పును నీవు క్షమింపవచ్చును. నీవు కృపాళుఁడవని నేనెఱుంగుదును. నీవు నన్ను క్షమింపవా? అయిన నేనింక నెందులకు మరణించితినిగాను? మిత్రవత్సలా! నాకొకమాటకు ప్రతివచనంబిమ్ము. నేనశ్వముమీఁద వెంకటాపురమార్గము నందలినిబిడారణ్యములమధ్యనుండి వచ్చునప్పు డాప్రదేశములయందు సాకవార్యమగుభక్తివిశ్వాసములు జనియించినవి. నాకట్టిస్థలము వాసయోగ్యమేమో చెప్పుము. అట్టివి పావనులగుసంయములకు నిరతనివాసయోగ్యములై యుండినవి. ఇట్టిస్థలములందుండువారు కలుషములొనర్పరు. ఈ భావముతోనే నేను వెంకటాపురమునకు వచ్చియుంటిని. కాని, యిచ్చటఁగూడ జనసంకులము తప్పలేదు. ఈమనుష్యసమూహమున నాకేమియుఁ దోఁచుటలేదు. నాకుపదేశింపుము. ఆస్థలములు నాకు నివాసయోగ్యములేమో!—"

కొన్నిదినములకు రంగారావునొద్దనుండి ప్రత్యుత్తరమువచ్చెను.



"పాణీ! నీవు క్రమముగఁ బిచ్చివాఁడవయిపోవుచున్నావు. చిన్నతనమున మనముపాఠశాలలోఁ జదువుకొను నప్పటిమంచిదినములఁ దలంచుకొనుము. నీవెంతో యానందముతో నుండువాఁడవుగావా? ద్రవ్యహీనులమగుమాబోటివారము పైగాఁజదువఁజాలక పాఠశాలఁ జాలించుకొంటిమి. నీవు ద్రవ్యవంతుఁడవు. రాజమహేంద్రవరమేగి చదువుకొనుచుండఁగాఁ బ్రయోజకుఁడవగుదువని సంతసించితిమి. నీకోరిక లీవిధమున గొంతెమ్మకోరికలైనవేమి? నీవంటియువజనులందఱును సంయమీశ్వరులై యరణ్యములం బట్టిన నిఁక లోకమెందులకు! మోక్షాపేక్షకు సన్యాసమే మార్గముకాదు. సంసారులకుఁగూడ మోక్షమార్గమున్నది. నీకివి తెలియనివా? ఈకోరికలను మానివేయుము"

ఆయుత్తరమును జూచుకొని చక్రపాణి యానందింపలేదు. అతనిహృదయాందోళన మభివృద్ధిఁ జెందెను. కొన్నిదినము లాతఁడు ప్రత్యుత్తరమీయలేదు. తుదకొకదినమున రంగారావున కిట్లు వ్రాసెను.

"మిత్రమా! ఈవిశాలప్రపంచమున భవిష్యముం దెలిసికొనినవాఁ డెవ్వఁడున్నాఁడు? నాయనంతరమున నీవు నన్ను మఱచిపొమ్ము. కాని, యీదీనుఁ డెంతవఱకీభూమిమీఁద సజీవుఁడైయుండునో, యంతవఱకుఁ బ్రబలవాత్స

ల్యభావముతో నీతనిని క్షమియించుకొనుము. నేను కేవ
లము దురదృష్టవంతుఁడను. నేను విషవాహినిలోఁ బడినాఁ
డను. కాని, యది నాకు మొదట విషవాహినియని తెలియ
లేదు. ఆవిషజలము నమృతమని భ్రమించితిని. నేనావిషజల
ములను ప్రీతితోఁ ద్రావితిని. అది నాతలకెక్కినది. యా
తనచే నిప్పుడు విషజలమని గ్రహించితిని. ఇప్పుడు నేనేమి
చేయను? విషముతలకెక్కిపోయినది. నన్నుఁ దిట్టకుము.
నేనిం దసహాయుఁడనై పోయినాను. నాహృదయ మిదివఱలో
నెంత దృఢమైనదని నేను తలంచియుంటినో యిప్పు డంత బల
హీనమైనదని తెలిసికొనుచున్నాఁడను. మిత్రమా! ఒక
గూఢపదార్థము నాయొద్దఁ దాపఁబడుచున్నది. దేని నతి
ప్రియముగ హృదయమున దాచియుంచితినో, దాని నట్లే
యుంచెదను. కాని, వెల్లడింపను. దుర్భరమగు నావిచారమే
నాకానందము. దానిని నేను శాంతభావముతో ననుభవించెద
ను. అశ్లీకారమన్న విచారమును మరల్పుమని సర్వరక్షకుఁడగు
నాభగవంతునిఁ బ్రార్థించుట కెందుల కిచ్చగింపను!—"

కొలఁదికాలములోనే రంగారావునొద్దనుండి మరలఁ
బ్రత్యుత్తరము వచ్చెను.

"మిత్రసత్తమా!

నీవు వ్రాసినలేఖ చేరినది. నీయుత్తరముం జూచిన



తోడనే యపరిమితానందభరితుఁడ నయితిని. కాని, సంగ
తులు నన్ను కలవరపెట్టుచున్నవి. ఈలోకమున భవిష్య
ద్వర్తమాన మెవరికిని దెలియదని వ్రాసియు, "నాకిద
సంసారము నన్ను వదలదు" అని వ్రాసితివి. నీమరణవృ
త్తాంతమును నేను విందునో, నామరణవృత్తాంతమును నీవు
విందువో యెవ్వరెఱుంగఁగలరు. ఇట్లు వ్రాసితివేమి? దీని
బట్టిచూడ నీమనస్సు నిశ్చలముగా నున్నట్లు తోఁచదు. సో
దరా! ఎప్పుడును విచారాలోచనపరుఁడవై యుండకుము.
సత్యముగా నీయారోగ్య మీయాలోచనలవలననే చెడి
పోవుచున్నది. ఇప్పటినుండి సంతోషముగానుండి నీమనస్సు
నందుండు దీర్ఘవిచారములను తొలఁగించినచో నీలోకమున
నీకంటెఁ బరమసుఖి యెవ్వఁడు? నీవెందులకు కష్టవంతుఁడవు
కావు? నేను విషజలపానము చేసితినని వ్రాయుచున్నావు.
నీస్థితిగతులనుబట్టి యది సత్యమనియే నమ్ముచున్నాను. నిన్ను
సహాయమును గూర్చి యడుగఁగోను. కాని, యావిషయమున
నేనించుకయైనఁ దనుచికిత్సఁజేసి మిత్రఋణమును దీర్చికొ
నఁగలనని నాదృఢవిశ్వాసము. ప్రాణమిత్రమా! నీవు పరమ
సుఖివైయుండఁగఁజూచుభాగ్యము కలుగఁజేయవలయునని
శ్రీరామచంద్రమూర్తిని సదా ప్రార్థించుచున్నాఁడను."

## పంద్రెండవ ప్రకరణము.

చైత్రశుద్ధనవమిదినమున భద్రాచలక్షేత్రమున జరుగు శ్రీ సీతాకళ్యాణోత్సవమున కనేకజనులు భద్రాచలమునకు వచ్చుచుండిరి. ఆసంవత్సరము రోహిణివిశేషప్రయత్నముంజేయఁగా సుదర్శనుఁడామెను వెంటఁబెట్టుకొని యచ్చటికివచ్చెను. వారు వెదకుకొనుచుఁ జక్రపాణియింటికి వచ్చిరి. చక్రపాణి యూరఁ లేఁడని తెలిసినది. ఆతనిభార్య మరణశయ్యమీఁదనున్నది. పతివ్రతాశిరోమణియగుసీత భర్తృవిరహమువలనఁ గృశించిపోయెను. ఆమెకుఁ బ్రాణములమీఁదఁ దీపిపోయినది. మరణకాలమున కెదురుచూచుచుండెను. అట్టిసీతయే చక్రపాణిభార్యయని విని రోహిణి చాలఁ జింతించెను. ఆవచ్చినవారు తనప్రాణకాంతుని కాప్తులని విన్నవిమ్మట సీత రోహిణిమొగమునుజూచుచు "సోదరీ! నాయదృష్టమిట్లున్నది" అనికంట నీరు పెట్టుకొనియెను. చక్రపాణి యెంతో వాత్సల్యమయుఁడని రోహిణి సంపూర్ణముగ నెఱుంగును. అట్టివానికిట్టిచిత్తవిభ్రమము—ఇట్టిమనోవైషమ్య మెట్లుకలిగినదాయని రోహిణి వింతపడసాగెను. చక్రపాణిసంసారము నిట్టిగతిలేనిస్థితిలోఁ జూడవలసివచ్చునని రోహిణి కలలోనైనఁ దలంపలేదు.



ఆగంటకాగంట సీతకు రోగము హెచ్చిపోవుచున్నదనుసంగతి రోహిణి తెలిసికొనియెను. అప్పుడామె సీతను సకరుణముగఁ జూచుచు నిట్లనియెను.

"సోదరీ! పాణి కుత్తరమువ్రాసి మనుష్యునంపుదునా?"

"ఆయనవచ్చెదరా? నాపాపపుఁగన్నులకాయన దర్శనము లభించునా?"

అని వెక్కివెక్కి యేడువసాగెను.

రోహిణి యామె ననేకవిధముల నూరడించి యీక్రిందివిధముగఁ జక్రపాణి కొకయుత్తరమువ్రాసి యొకమనుష్యునకిచ్చి పంపించెను.

"పాణీ! ప్రియసోదరా! మీబావగారును నేనును, శ్రీరామనవమికి నీవిక్కడనుండువనియు, ఈమహోత్సవదినములలో సుఖముగఁ గాలక్షేపము సేయవచ్చుననియుఁ దలంచి యిక్కడకు వచ్చితిమి. నీవింట లేకపోయితివి. మేము మరలిపోవుదమని తలంచితిమి. కాని, మరణశయ్యపైనున్న నీప్రియురాలగు సీతను జూచుటతోడనే, ఆమెమరణబాధను గనుటతోడనే నాహృదయము నీరైపోయి యేమిచేయుటకును దోఁచక నీకీయుత్తరమువ్రాయుచున్నదానను. నీవిట్టివికలచిత్తుఁడవై పోవుదువని నేనెన్నఁడు ననుకొనలేదు. అన్ని

యు నివ్వవేల? ఈయుత్తరమందినట్లుగనే బయలుదేరిరాకున్న సాధ్వీమతల్లియగు నీప్రియురాలిమొగమును నీవీజన్మమునఁ జూడఁజాలవు. ఇంతతొందరగ నుత్తరము వ్రాసినందులకు క్షమింపుము. వెంటనే బయలుదేరిరమ్ము.

ఇట్లు ప్రియసోదరి,

రోహిణి."

---

## పదుమూఁడవ ప్రకరణము.

రంగారావు గడియగడియకును సీత స్థితిగతులనరయుచు, డాక్టరునొద్దనుండి యౌషధములనుదీసికొనివచ్చి యామె కిప్పించుచుండెను. రోహిణీసుదర్శనులు రంగారావునకుఁ జక్రపాణిపైఁగల సుహృద్భావమునకుఁ జాలమెచ్చుకొనిరి. రోహిణి, సీతశయ్యాపార్శ్వమునఁగూర్చుండి, యామెకు వివిధోపచారములఁజేయుచుండెను. ఎవరెన్నియుపచారములుచేసినను సీతకుఁ గ్రమముగా వ్యాధి ముంచుకొనివచ్చుచునేయుండెనుగాని తగ్గుటలేదు. రోహిణి యామె నాడినిబట్టి బరీక్షించి తలయూచుచు నొకదీర్ఘనిశ్వాసమును విడిచెను. రంగారావామెభావమును గ్రహించి "అమ్మా! డాక్టరును దీసికొనివత్తునా?" అనియెను.



"శీఘ్రముగఁ దీసికొనిరండు. ఇప్పుడు మంచిమందులు పడవలయును."

రంగారావు వెడలిపోయెను. సుదర్శనుఁడు చక్రపాణి రాకకై నిరీక్షించుచు మాటిమాటికి వీథిగుమ్మమునొద్దకుఁ యి తొంగితొంగిచూచి వచ్చుచుండెను. ఆతని యాతురపాటును జూచి రోహిణిగద్గదస్వరముతో "పాణి యింకను రాలేదు. ఈసమయమున వచ్చిన బాగుగనుండును" అని యనుకొనియెను. సీత యక్కడ లోలోన నేడ్చుచుండెను.

ఇంతలో రంగారావును డాక్టరుగారును గలిసి వచ్చుచుండిరి. త్రోవలో పడవదిగి యప్పుడేవచ్చిన చక్రపాణి వారిని గలిసికొని "మిత్రమా! యెట్లున్నది?" అని తొందరగా నడిగెను.

"అపాయస్థితిలోనున్నది." అని చక్రపాణి ప్రత్యుత్తరమిచ్చెను.

వారు ముగ్వురునుగలిసి వేగముగ గృహమునొద్దకుఁ బోయిరి., చక్రపాణిసత్వరముగ లోపలకుఁబోయి, శయ్యాగతయై మరణయాతననందుచున్న తనప్రియురాలగు సీతనుజూచెను. ఆతనికదియేప్రథమదర్శనము— అదియేకడసా

దియును—శ్రీకృష్ణగూర్చుండియున్న రోహిణి ముఖమును మాత్రముచూడఁజాలక తలవంచుకొనియెను. అందఱికన్నులనుండియు నశ్రుబిందువులు జలజలరాలుచుండెను. ఇంతలో డాక్టరు లోపలకువచ్చి సీత నాడినిబరీక్షించి "ఆశలేదు" (hopeless) అనిచెప్పి వెడలిపోయెను.

ఇంతలో సీత యించుకకదలెను. కన్నులు తెఱచుచున్నట్లగపడియెను. అప్పుడు రోహిణి బిగ్గరగ "అమ్మా! సోదరీ! పాణి వచ్చినాఁడు. చూడుము. 'చూడుము!" అనియెను. సీత యొకటిరెండుసారులు కన్నులుతెఱచి భర్తమోమునుదిలకింపఁగలిగెను. ఆయవకాశముననే యామెప్రాణవాయువులు పైకెగిరిపోయెను. అప్పుడందఱును గొల్లుమనిరి.

పాణి గట్టిగనేడ్చుచు "సోదరీ! రోహిణీ! నేను మహాపాపాత్ముఁడను. నాహృదయము పాపపూరితమైపోయినది. నేనెన్నిజన్మములకునుగూడ నీపాపపంకిలమునుండి విడివడఁజాలను. నాకీశాస్తిచాలదు.—ఈశాస్తిచాలదు." అని వాపోవుచు నట్టె మూర్ఛఁబడిపోయెను.

రంగారావు సుదర్శనుఁడుమొదలగువా రుపచారములుచేసినపిమ్మటఁ జక్రపాణికొంతసేపటికి లేచి కన్నులుతెరచి సీత మొగము వైపునకు మరల నొకసారి చూచెను. అప్పుడా



మె "నాథా! నావలననైనదోషమేమి? ఏదోషముఁగలన నామొగమునైనఁజూడకుండ నన్నునిరాకరించివైచితిరి?—ఇప్పుడు నన్నుక్షమించితిరి. లేకున్న మీదర్శనమెట్లునాకు లభించును? నాపాపపుమొగమునఁజూపుట కిప్పటికైన నదృష్టరాలనైతిని. ఆహా! ప్రాణనాయకా! నేఁడు శాంతముగ—సంతోషముగ— ఆలోకమునకుఁబోవుచున్నదానను.—నన్నుమఱచిపోఁడు" అనుచున్నట్లాతని హృదయమునకుఁ దోఁచెను.

* * * * *

నాఁటిరాత్రియే చక్రపాణి యెవ్వరితోడను జెప్పకుండ నెక్కడకో వెడలిపోయెను. రంగారావునకుఁగాని, రోహిణీసుదర్శనులకుఁగాని, ఆతనిమిత్రులకు మఱెవ్వరికిఁగాని, యాతనిజాడ దెలియరాలేదు. చక్రపాణి పాతాళమునఁ బడిపోయెనో, మరణించెనో, యెవ్వరికిని దెలిసినదికాదు. విషవాహినిపూర్తియైనప్పు డాశాభంగముగాక, క్షమయేమి లభించును?

---

# అనుబంధగ్రంథములు.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1. రాధారాణి. | 0 | 4 | 0 | 0 | 4 | 0 |
| 2. యుగళాంగుళీయకము. | 0 | 3 | 0 | 0 | 3 | 0 |
| 3. రాజభక్తి. | 0 | 2 | 0 | 0 | 3 | 0 |
| 4. లీల. | 0 | 3 | 0 | 0 | 4 | 0 |
| 5 సాధన. | 0 | 5 | 0 | 0 | 7 | 0 |
| 6. ఇందిర. | 0 | 3 | 0 | 0 | 4 | 0 |
| 7. ప్రభావతి. | 0 | 2 | 0 | 0 | 7 | 0 |
| 8. మాలతి. | 0 | 1 | 6 | 0 | 4 | 0 |
| 9. కమలాకాంతుఁడు. | 0 | 1 | 6 | 0 | 3 | 0 |
| 10. * పతిమళ | 0 | 6 | 0 | 0 | 2 | 0 |
| 11. రజని. | 0 | 6 | 0 | 0 | 2 | 0 |
| * 12. నీరద. | 0 | 5 | 0 | 0 | 8 | 0 |
| 13. సీతావనవాసము. | 0 | 5 | 0 | 0 | 8 | 0 |
| 14. ఉన్మాదిని. | 0 | 3 | 0 | 0 | 7 | 0 |
| 15. సంతాపకుఁడు. | 0 | 4 | 0 | 0 | 5 | 0 |
| 16 ఆరణ్యక. | 0 | 6 | 0 | 0 | 8 | 0 |
| 17. వియోగిని. | 0 | 3 | 0 | 0 | 4 | 0 |
| 18. కృష్ణకాంతునిమరణశాసనము. | 0 | 6 | 0 | 0 | 8 | 0 |
| 19. చంద్రసేనుఁడు | 0 | 4 | 0 | 0 | 5 | 0 |
| 20. వ్యాఘ్రాచార్యబృహల్లాంగూలము. | 0 | 2 | 0 | 0 | 2 | 6 |
| 21. ఉన్మత్త | 0 | 2 | 0 | 0 | 2 | 6 |
| 22. మీరాబాయి. | 0 | 1 | 0 | 0 | 1 | 0 |
| 23. రాణీతారాబాయి. | 0 | 1 | 0 | 0 | 1 | 6 |
| 24. కాబూలుసాహేబు. | 0 | 1 | 0 | 0 | 1 | 0 |
| 25. భారతమహిళ. | 0 | 5 | 0 | 0 | 7 | 0 |
| 26. భారతీయులయుపనివేశములు. | 0 | 2 | 0 | 0 | 2 | 6 |
| 27. హారావళి (ప్రథమభాగము.) | 0 | 3 | 0 | 0 | 4 | 0 |
| 28. హారావళి. (రెండవభాగము) | 0 | 3 | 0 | 0 | 4 | 0 |

